శ్రీ శుభమస్తు.

శ్రీ విఘ్నరాజాయ నమః.

# సూరదాసు చరిత్రము

ఇయ్యది


విశాఖపట్టణము జిల్లా, అనకాపల్లి వాసుండగు

బీ. బాలాజీదాసునిచే


హరికథగా వ్రాయంబడినది.


ప్రకటనకర్త:

కె. శకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్కుడిపో,

బెజవాడ, కృష్ణాజిల్లా.

5 వ కూర్పు: 1000 ప్రతులు.

బెజవాడ:

ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింప బడినది.

1934.




[వెల రు. 0-6-0.

# హెచ్చరిక.

విజయనగర వాస్తవ్యులును, గానవిద్యా విశారదులును,
హరికథా పితామహులు నగు
బ్రహ్మశ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారిచే రచియింపబడిన

## హరికథలు.

ఈక్రింద నుదహరించిన పుస్తకములయొక్క సర్వహక్కులు
మేము గైకొని ప్రచురించినాము.

| | | |
|---|---|---|
| 1. జానకీశపథము | ... | 1—0—0 |
| 2. రుక్మిణీ కల్యాణము | ... | 0—12—0 |
| 3. మార్కండేయ చరిత్రము | ... | 0—12—0 |
| 4. హరిశ్చంద్రోపాఖ్యానము | ... | 0—12—0 |
| 5. అంబరీష చరిత్రము | ... | 0—8—0 |
| 6. భీష్మచరిత్రము | ... | 0—8—0 |
| 7. గజేంద్రమోక్షము | ... | 0—8—0 |
| 8. ప్రహ్లాదచరిత్రము | ... | 0—8—0 |
| పై యెనిమిది పుస్తకములు కలసిన క్యాలికో బైండు | ... | 5—8—0 |

వలయువారు :—

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ,

కృష్ణా జిల్లా.



శ్రీ

# సూరదాసు చరిత్రము.

కమాచి — చతురశ్రగతి.

దేవదేవునిం గొల్వుమా, మనమా, వినుమా, నిరామయుని ॥దేవ॥
భావాతీతుడే దాసావనాసక్తుడే ॥దేవ॥
ఇతరమతములెల్లబాసి । మదిసమ్మతము చేసి । షడ్రిపులద్రోసి ॥దేవ॥
పరమాత్ముండొక్కడనక కుక్షింభరత్వమునకై మతములల్లుద ।
బ్బరగురువుల నెదనమ్మక సత్యం । బరయ మేలు బాలాజీనేలు॥దేవ॥

## గురుస్తుతి

క॥ తగనాంధ్రభాషగరపిన । తగవరి పోట్మూరుకులసుధావార్థివిధుం
డగు వెంకటస్వామి మదీ।యగురుని మదిలోదలంతునసవరతంబున్.

## కవివంశావళి

సీ॥ ఫలసస్యవృద్ధిసద్వ్యాపారములచేత, మనుఅన్కపల్లిగ్రామనిలయుండ
గురు భరద్వాజసగోత్రప్రపావన, ప్రభుడు లక్ష్మణదాస పౌత్రకుండ
రహిమీర కేశవరామాఖ్యునకు గన్న, మాంబకునేద్వితీయాత్మజుండ
విశ్రుతగానప్రవీణుడౌ బాలాప్ప, సాదుగారికి నే సహోదరుండ

గీ॥ శైలజాహృదయాబ్జ భాస్కరకటాక్ష
వీక్షణప్రాప్తగానకవిత్వయుతుడ
శ్రీరమేశకథాబోధనారతుండ
వరయ బాలాజిదాస నామాంకితుండ॥

కళ్యాణి — త్రిశ్రగతి.

సూరదాసుని చరితము హృతదురితము, రసభరితము ॥సూర॥
పారునివంశమునందుబుట్టి । బాలాజీదాసునిజేబట్టి
కూరిమినేలినజగజెట్టి । కృపారసమును గొన్నట్టి ॥సూర॥
చరణములకు గజ్జలుగట్టి । మృదు । కరమున తంబూరబట్టి
తధికిటయనియాడుచు । తాళమానమును జూపుచు !
స్థిరమతితో విరించి, జనకుని స్మరించి, తరించిన ॥సూర॥

వ॥ శ్రీగంగానదీతీరంబున కాశీనగరంబనుపురవరంబొకటిగల దదెట్టిదనిన.

సీ॥ వరతారకాగమాభ్యసనప్రముదితప, ర్వతసుతాధిపయశోరాశికాశి
చంద్రశేఖరపాదసారసమధురస, గ్రసనరంజితభక్తరాశి కాశి
పరవధూగమన భూపద్రోహమృగవధ, ప్రముఖపాపవనాసిరాశికాశి
సారవిహీన సంసార వారాశి తా,రణ విచిత్రప్లవరాశికాశి

గీ॥ ప్రాజ్యభవ్యాదరితసత్రరాశికాశి
ఆశ్రితాఖిలపండితరాశికాశి
ప్రవిమలోదకాన్వితపుణ్యరాశికాశి
వాసయోగ్యస్థలం బదే వారణాసి.

వ॥ ఇట్టి కాశీపురంబున రాధాబాయి శివనందను డను భార్యాభర్త లుండ కొంతకాలంబునకు పుత్రుం డుదయించె నంత వానికి సూరదాసుండని పేరిడి ప్రేమను పెంచుచుండ పదియారేండ్ల ప్రాయ మాతనికు మారునకు వచ్చునంతట జనకుండు డీల్గె నంత రాధాబాయి మనంబున.

నాదనామక్రియ — త్రిపుట.

అయ్యయ్యో యీ యాడజన్మ మవని నేలబుట్టించెనో విధి॥ అయ్య॥
ఒయ్యన మున్నే మినోచితినో । యియ్యెడ నాపతి చయ్యన సద్గతి
జెందెనేమ । నందు రామ । చంద్రవేమ ॥అయ్య॥
తనరగ నత్తమామల । బెనిమిటి నిరుగుపొరుగు
జనుల ఘనుల మునుల దీనుల । ననవరతము విసయమతము
చేతను బూజించితి మేలెంచితి
దసర పాలితబాలాజీదాసుని । వాగ్భాసుని కృపలేమిని ॥అయ్య॥

వ॥ ఇట్లు విచారించి యుత్తరక్రియలు సల్పి తదనంతరము తండ్రి సంపాదించిన విత్తమంతయు భోగకాంతలపాలుచేయుచు వ్యర్థముగ దిరుగుచున్న, తల్లి కొమరునిం గని.

నాటకురంజి — ఏకతాళము.

చదువబోరా గురుసన్నిధిని జేరి గుదురుగను కోవిదులుమెచ్చవత్స ॥చ॥
చదువు నేర్చినవాని । సకలదేశముల కో
విదునిగ నెన్నుదు । రిది నిజము నమ్ము । లెమ్ము ॥చ॥
భువిని విద్యవలన । భూపాలసన్మానము
సవినయుడగు బాలాజీని । సంతరించువాని గన సా
ధనము । మాట వినుము । త్వరజనుము ॥చ॥

కమాచి — చతురశ్రగతి.

ఏలరా! వానిజన్మం బేలరా! నా చిన్నికుమారా! ॥యే॥
పాలకడలిశయన జలజనయన । పాలింపవె బాపనాశయనుచును
చాలా । వినుతిజేయుభక్తజాల । ముతో సంగడి మన
కేల । యనుచును వారల గడు దూల । నాడుచు గుమతుల వేడుచు
పడతు గూడుచు । కాలుని । కేలజిక్కి కోలనెక్కి గూలిస్రుక్క ॥యే॥
రంగుమీరి బాలాజీదాసు మృ । దంగతాళ నృత్యగీతసత్ప్రి

సంగ । ములు పెడచెవి నిడి తళంగ । కిడతకతధిగిణ యని వా
రాంగనామణులు యాడి సారంగవాహుని బాటలు బా
డంగ । విని, మోహముగొని, వెంటనె చని । య
సంగ సంగరమున జెలంగి మెలంగి । వల
బడి । ధనము నిడి తుదకు జెడు ॥శేల॥

వ॥ కొడుకా! నిష్కారణము పడపుపడంతులకు ధనమిచ్చు చుంటివే బ్రాహ్మణుడై నందుకు.

భైరవి — చతురశ్రగతి.

వినుము కుమార । వివరించెదను కూరిరా ॥విను॥
వనజసంభవుకుల । మున జనించిన ఫల । మేమి ॥విను॥
నిగమాగమశాస్త్రములు । నీటుగ జదివి ప
రగ బాలాజినేలె । ఖగవాహనుని పాద
యుగళము వేడ కి । జగతిని సా । ధుగణము దూ
రగ దిరుగుట వీ । లుగ నీకు దోచెనా! యోచన । లేదుగ । పాడుగ॥విను॥

వ॥ ఎంత బోధించిన వినక కలధనంబెల్ల కొల్లబెట్టిన తల్లి యాచించి పెంచుచుండ తోడివాండ్రు సూరదాసునియొద్ద విత్త మున్నంతవరకు నత్తితిరుగుచు దాసు నిర్ధనుడైన వాని చెలిమి విడిచిరి గాని కటికిదుకాణము మరిగిన కుక్కచందమాయె వీరి సంగతి.

చ॥ వినుము కసాయిగొట్టునను భీతిని మాంసము ముట్టకా స్థలం
బును విడలేనికుక్కగతి భోగమవీథిని జేరి వట్టి సూ
చన లిడి వుచ్చగిత్తలు పచారులు సేయుచునుండ్రు లోనికిం
జను ధృతిలేదు రూకలనొసంగుటకు స్థితిలేదు చూడగన్.
వ॥ అంత రాధాబాయి ప్రాణము విసికి సూరదాసు నాలోకించి,

కమాచి — చతురశ్రిగతి.

నాతరముగాదురా । తనయ పోషింప ॥నాత॥
ఖ్యాతిరహితా । వారనాతీలోల పాతక ॥నాత॥
ఇన్నిదినంబులు యాచనజేసి । యన్నంబిడితి నాకన్నతండ్రి ॥నాత॥
దేహపటుత్వముదప్పె నికనీ । ద్రోహబుద్ధివిడచి బ్రతుకవలయు॥నాత॥
బాలాజీవరదుండగు శ్రీహరి । పాదపద్మమాన జగాన ॥నాత॥

తా॥ ఎన్నివిధముల బోధించిన వినకున్న గొమరునిజూచి
చిన్ననాన్న నీవున్న సౌఖ్యమేమున్నది పోరలేచి,
అని రాధాబాయి యిట్లుబల్కిన సతి దుఃఖాత్ముండయ్యెన్
తనపొట్టను పోషించుకొనుటకై తహతహపడుచునుబోయెన్.

వ॥ అంత రాజమార్గంబున బోవుచున్న దానయ్య యను నావికుం డొకడు సూరదాసునిం గని బ్రాహ్మణుం డని నమస్కరింప నావికు నాలోకించి.

ఆ॥ గీ॥ తండ్రికొడుకు లొక్కదానిగూడిన నిర్వు
రసును కొమరు లొదవ రణములోన
నొక్కని కడతేర్చి నొకనికి రాజ్యం
బొసగిన ప్రభువు నిన్ను సాకుగాత.

తా॥ సూర్యుఁడు, యముడు, కర్ణుడు, ధర్మరాజు, కృష్ణుడు.

వ॥ ఇట్లాశీర్వదించి వానింగని,

కల్యాణి — త్రిశ్రిగతి.

కర్ణధార మనవి యాకర్ణింపు సుహృదయ ॥క॥
పూర్ణముగ నీదయ । పొందుపఱచుమిా సదయ ॥క॥
రజ్జుల నాకభ్యసింప జేయుమయ్య ని
న్నొజ్జగా భావింతు నిజ్జగాన । నొనరజీవింతు నా పెన్నిధాన ! ॥క॥

భాసురమతి బాలాజీ । దాసు నేలు సువర్ణ వాజి ।
వాసిమీఱగను నీదు।గాసి ద్రోసివేసి బ్రోచు ॥క॥

వ॥ ఇట్లు దాసయ్యను తాఁడులల్లుట నేర్పుమని వేడ సూరదాసుని నాతండు జూచి.

కమాచి — చతురశ్రగతి.

ధరామరా! వినుమా సుందర।నరా యీపని ఘనమా! ॥ధరా॥
విరించికులవరు లరమర లేకను । నిరాకరింతురు నీచపుపనియని ॥ధరా॥
మంచివృత్తిచేతను జీవించి । మహామహులపదములుసేవించి
వంచింౘెడి పడతుల నిరసించి । పాపపు షట్చత్రుల ఖండించి ॥ధరా॥
అంచితముగ బాలాజిని పాలించి । నట్టివాని ననిశము భావించి
యెంచదగినట్టి యశమునుగాంచి । యెడతెగని పదవిగొనుటయెమం ॥ధర॥

గీ॥ సూతు డిట్లన చెవులకు శూలములుగ
నాటగా సూరదాసు డచ్చోటువాసి
విపినమున కట్టెలను గొట్టి
విక్రయింప మోపులనుకట్టి పట్టణమునకు వచ్చి.

శహాన — రూపకము.

వంటచెరుకులను గొనరే వాస్తవ్యులారా! ॥వంట॥
అంటరాని వేల్పున కతి సులభమైనట్టి ॥వంట॥
అచ్చుగ వర్షకాలము । వచ్చును మీ కీటుజాలము
పుచ్చుక జెచ్చెరగొనుడు మీ।యిచ్చవచ్చిన ట్లొసగెద ॥వంట॥
వాటముగ బాలాజి నేలు । హాటకాంబరనాభీభవుడు
మాటవికట్టెలమ్ముమని ల।లాటమ్మున వ్రాసెగాబోలు ॥వంట॥

వ॥ ఇట్లు కట్టె లమ్ముచుండ రంగనాథుం డను కోమటి సూరదాసు నాలోకించి.

ఆనందభైరవి — చతురశ్రగతి.

ఎవరయ్యామీరు త్వరగ దెల్పుడు
భువి రవిరశ్మినుండ కీ । భూజముక్రింద రండు
అరసిజూడగ విప్ర । వరుడని దోచెడి ।
నిరువుగ గట్టెలమ్మ । హేతువేమొదెల్పు ॥దెవ్వ॥

రహిమీఱ బాలాజిని । రక్షణజేసిన శ్రీ
మహిళాధిపతికి నీపై । మనసుబుట్టగలేద ॥మొ॥

వ॥ ఇట్లడుగ సూరదాసుఁడు రంగనాథునిం గని.

గీ॥ వినవె కారుణ్యచిత్త నాపిన్ననాడె
నన్నుగనుగొన్న తండ్రి శ్రీనాథుదరికి
జనుట నన్నాతురుండనై వనములోని
కట్టెలమ్ముచు కాలంబు గడుపుచుంటి.

వ॥ ఇట్లన రంగనాథుండు చింతించి.

తో॥ అనవిని నీకీకష్టంబేటికి ననుదినమున మాయునికిన్
దనరగనిడుమింధనములు ధనములు గొను మిడకింకొక్కనికిన్.

ఉ॥ నావినిబ్రాహ్మణుండు దననాయనపోయిననాటి చింతలన్
బోవగజేసికొంచు గుణపూర్ణుని వైశ్యునియింటికిన్సదా
బోవుచునొక్కకట్టియల ముట్టియవేయుచునుండి తద్వశి
గ్భావిని సత్ప్రభావిని నగస్తని శస్తనిధిం గనుంగొనెన్.

కం॥ కనితనయాత్మగతంబున । వనితాయావనవిలాస వైఖరులెల్లన్
బెనగొనగనిట్లనుచుదా । వినుతింపందొడగెమారవికిఖహతుండై.

వ॥ రంగనాథుని భార్యయగు సత్యవతిని సూరదాసుం డాలోకించి.

హిం॥ భైరవి — త్రిశ్రగతి.

చెలియనోయగంబు నుతిసేయగ నాతరంబు గాదు ॥చెలి॥
పాలతినెమ్మోగంబు పరి। పూర్ణశశినిభంబు ॥చెలి॥
నడ విఖ్యాతృహాయము వే। నలి పుష్పంధయము
పడతినళితృియముసో। పాసనముదయము ॥చెలి॥
చుక్కలదొరకొృవ్వదిగ। దొృక్కడు లేనవ్వ
ముక్కునువ్వబువ్వ నుతి। కెక్కినట్టిజవ్వ ॥చెలి॥
కలికినడుముమిన్న తను। కాంతి కెనయెపొన్న
అలపలుకులుజున్న లేత। యరటియాకువెన్న
బాలాజీదాసు। నేలు పితవాసు
డీలతాంగివన్నె। గని వి। రాళిజెందకున్నె ॥చెలి॥

వ॥ ఇటుల మనమునతలపోయుచు దానికటాక్షము సంపాదింప నెంచి ప్రితిదినమును కట్టెలనిచ్చుచు ధనము కోరకయున్నంత సత్యవతి యనుమానించి.

హిం॥ భైరవి — త్రిశ్రగతి.

స—విత్తమడుగకుందునేమి। విప్రవర్యుడ। నీ
చిత్తమేమొదెల్పుము ప్రసిద్ధచర్యుడ ॥విత్త॥
సూ—ధనమదేలయిాకృపా। ధనమెచాలును
వనరుహనాభుండునరుల। వరుసనేలను ॥ధన॥
స—ఊరకెపరధనమును గొన। నుచితమ మాకు
సూరదాస! సొత్తునుగొను। సుకృతము మీకు ॥విత్త॥
సూ—లోలేక్షణ! యిటువినుధన। లోభము లేదు
బాలాజీపదమాన య। బద్ధముగాదు ॥ధన॥

కం. అనవిని మానినితనమన। మున ననుమానించి విభుని మ్రోలకుజని వి
ప్రునిని త్తవిరాగోక్తులు। వినిపింప నతండు జ్ఞానవినశుండగుచున్॥

సురట — చతురశ్రగతి.

బాలామణీ యెంతటి । భాగ్యమబ్బెనే మనకు ॥బా॥
బాలాజీనేలిన గో । పాలు డీలీల మన
శీలముగన్గొన వి । చ్చేసె నిటుగాబోలు ॥బా॥

ఆమహానుభావుని । యంతరంగభావమేమొ ।
యేమరక గన్గొని । యిష్టముదీర్తుననుము ॥బా॥

తో॥ నాథుం డీగతి నయమునబల్కిన నారి భూసురునిజేరి
యోధీరా! భవదీయోద్దేశం బొనర్ప దెల్పు మిటు జేరి
సందియమొందక డెందముచందము పొందుగ దెల్పుము నేడు
క్రిందుగగోరిక సఫలముజేసెద కాంతుని పదములతోడు॥

వ॥ ఇట్లు సత్యవతి పలుక సూరదాసుండు సందడిగొని.

జంఝూటి — త్రిశ్రగతి.

కమలనేత్రి! నీదుచిత్త । కమలమిడగదె
సుమశరుతూపులతతివే । డిమి గదిసె గదె ॥క మ॥

అతివ నీకై వ్రితమునూని యీ । గతిని వచ్చితి
నీగతిని వచ్చితి రూపజిత రతీసతీ! ॥క మ॥

బిత్తరి! నీపొత్తు గోరి । విత్తమువూని
విత్తమువూనియుంటి । విట్సత్తమురాణీ!
బాలాజీదాసునేలు । బాలకృష్ణుడు
బాలకృష్ణుడుబ్రోచు కౌస్తుభ । భ్రాజిష్ణుడు ॥కమ॥

వ॥ ఇట్లాడుగ సత్యవతి విని విస్మయమంది భర్తయాజ్ఞయయినది
గాన దోసంబులేదని సూరదాసు నాలోకించి.

బేహాగ్ — చతురశ్రగతి.

కోర్కె యిదేనా సి ॥కోర్కె॥
అర్కసమాన తేజ! యవనినిర్జరరాజా! ॥కోర్కె॥
కాంతుడు నే డితర। గ్రామమునకుజను
స్వాంతమిచ్చెద। నీసాయంతమురమ్ము ॥కోర్కె॥
వాసిగను బాలాజీ। దాసునేలినశ్రీని
వాసునిసాక్షి। మదనునిగాసిద్రోసి। వేయుదము ॥కోర్కె॥

వ॥ కనుక దయయుంచి నీవిత్తము నీవుగొని.

హిం॥ తోడి — చతురశ్రగతి.

Tonight only come here lonely (To)
Truly I shall wait for you at the gate (To)
By your favour I have things many
I don't want any I want only your company
Neither a guinea nor a penny (To)

కం॥ ఆసారసాక్షివాక్యలు। భూసురుడాలించి ముదముబొందుచుసుమబా।
ణాసను పొంకంబార్చెద। నీసాయంకాల మనుచు నెంచుచునుండన్.

వ॥ ఇంత సత్యవతి భర్తదరికేగి పదములకు బ్రణమిల్లి.

కళ్యాణి — త్రిశ్రగతి.

ఓనాథా! యికయేమనివిన్నవింతుమానసపద్మమునుగోరెదాను ॥ఓనా॥
తమయానతిబూనినేవానికోర్కెలిడమానసమునదలచియీరే
యిని రమ్మంటి నో। పుణ్యవారా। సుధీరా! ॥ఓనా॥

వ॥ ఇట్లన రంగనాథుం డంగన నాలోకించి.

కం॥ కాంతా నీస్వాంతం బా। కుంతీసుతరక్షణుండు గోరె నరులు పై
కాంతకటుసాహసింతురె। దంతివరమకోర్కెదీర్చుతగసౌఖ్యమిడున్॥

వ॥ ఇట్లు దంపతులు సంభాషించుచున్న సమయంబున.

సీ॥ కాలమన్నట్టి కంసాలియామినియను, మగువకు నగలుచేయగదలంచి।
దినకాంతి యను హసంతికలోన రవియను, బంగారమును గాచి పడ
మటిమల।యను పట్టెపై గొట్టి వనధిపాత్రినుబెట్టి, యుడుపతియనెడి
రాగిడినిజేసి । లాంఛనంబనెడి నీలము నమర్చియు దార,లనునట్టి
ముక్తాఫలములుగూర్చె ।

గీ॥ ననగ యామినీ వనజాయతాక్షి చెలగ
సూరదాసాఖ్యు డుహ్వాంగి బేరిసతిని
గదియ మదినెంచి ముదమున సదనమునకు
నరుగుదెంచిన గుణవతి యతని గాంచి.

బేగడ — చతురశ్రగతి.

భూసురోత్తమా! పూలపాన్పుపై బవ్వళింపుమా । పవ్వళింపుమ॥భూసు॥
వాసిగ సుమబాణాసనునిగాసి। ద్రోసివేయుదముభాసమానగాత్ర॥భూసు॥
ఇదిగో వచ్చెద సదనముఁన కేగి।
మదిని బాయ బుధవిధేయ । విధుడుగాయ ॥భూసు॥
ముదముతోడ బాలాజీని బ్రోచిన
మదనజనక పదము లెదను వదల కెలను ॥భూసు॥

న॥ ఇట్లన మారునిపోరికి నోరువలేక దాసుం డాభాసురాంగితో.

హిందూస్థాని తోడి — త్రిశ్రగతి.

Handsome lady you are gaudy
Embrace my body now I am needy (H)
Flower arrows pinches me rapidly
Moon as enemy burns me stupidly (H)
Dear lover come however
I will never forget my dear (H)
Passions round me multiplies me
Dear lover come and kiss me (H)

న॥ ఇట్లు సూరదాసుం డనుచుండ గొంతతాళు మని యితరసదనమునకు సత్యవతి చని మనంబున.

కల్యాణి — చతురశ్రగతి.

సీదాసాన దాసురాల ॥సీ॥

యాదవకులసోమా! సమరభీమా! సుగుణనామా! కామకామ ॥సీ॥
సుమశరజనక! బాలాజీపోషపత్రి! విమలసుగుణశ్రేణి! చక్రపాణి! ॥సీ॥
పతియాజ్ఞ మీఱి నడచుట లుత్తమభామకు సరిగాదు।
క్షితిసురుని కోర్కెదీర్చిన నావ్రతభంగము లేదు। మానవ
తతి, వినినవారిమతి, నీగతిని దలతురో, కుజన స
మితిని గలతురో, యందుకు నామతిఁ ఖిన్నతనొం
దితిఁ। బోర్విము జగతిఁ। వాని వీని నమ్మలే
ద చేతతి, నీవేగతి సీతాపతి! ॥సీ॥

తో॥ ప్రజ్ఞానం బగు మానిని నిందను బాపుమనుచు వినుతించెన్
అజ్ఞానం డగు సూరదాసునకు విజ్ఞానం బుదయించెన్.

వ॥ ఇట్లు మనస్సు మారిన సూరదాసుండు మనంబున.

శంకరాభరణము — త్రిశ్రగతి.

బింబాధరి సంభోగము। వెఱ్ఱినై నే గోరితిని ॥బిం॥
కుంభినిలో నావంటి। కుజనుడు గలడె ॥బిం॥
రంభతో సమానమగు। రామ యనుకొంటినిగాని
కంబుకంఠి సాధ్వియని। గనుగొననైతి నయ్యయ్యో ॥బిం॥
నేత్రములచే పాపములకు। పాత్రుడనైతినిగాన
గాత్రస్థితపంచేంద్రియ।శత్రువులతో సఖ్య మేల ॥బిం॥
ధరణిలో బాలాజినేలు। దాశరథి మృదుపాద
సరసిజములు గొనియాడిన। సౌఖ్యం బని నెఱుగనైతి ॥బిం॥

వ॥ ఇట్లు వితర్కించుచు సత్యవతి రా వేగమే పదపద్మములకు మొక్కి.

కాఫి — చతురశ్రగతి.

వినుమా నామనవిని గై । కొనుమా యిటుగనుమా ॥విను॥
అనుమానం బిక యేలను । నీబాలుడ నేజేలను ॥విను॥
నారీ! కుసుమాస్త్రిని చేతికశారీ । నారాయణపుర సం
హారీ! వనజాసన శంబరారి పర్వతచయపక్ష వి
దారి సతుల నెన్న నీసరిదా రీ జగతీస్థలి గల్గిన
సూరిజనములు గొనియాడను దారిదొరకమి మోహాగ్నిని
దూరి సత్యవతీ నీహృద్వారిదము నిమ్మని నే నిను
గోరితినిగాన యోచాన నీవంటి సాధ్వని జగాన నే గాన
నావంటిపాపి యిలలోన నెచ్చట లేదు గుణనిధాన
తప్పులు మన్నించు విమాన బాలాజిని బోధించిన సూన
శరజనకునిపాదములాన రెండు సూదుల నిమ్ము
బిరాన గుణధురీణ వరానన ॥విను॥

వ॥ ఇట్లు సూరదాసుండు సత్యవతి పాదంబులపై వ్రాలి క్షమింపు మనివేడ నామె వానితో.

గీ॥ అవనిలోపల న న్నిపు డమ్మ యనుట
వీలుగా దిది ననవిల్తుకేళి సలుప
నెంచితిరిగాన నిటుల వచించ నేల
వ్యగ్రత గనుండు భూమిసురాగ్రగణ్య!

వ॥ ఇ ట్లన సూరదాసుం డామెను గని.

గీ॥ ‘మానవతి నాహృదయ మిప్డు మారెగాని
వాక్కు నప్పటి కిప్పటికొక్కటి సుమ
మంచిసూదుల ని’ మ్మన మించుబోణి
సూదులను చేతి కందియ్య సూరదాసు.

వ॥ సూదులను చేతబట్టినంతనే నాసమయంబున.

ఉ॥ నెట్టన కల్యమానవుడు నీరరుహాకర వైశ్యపాలి గ
న్పట్టెడు పద్మలక్ష్మి గొను భావముచే జలరాశిలోన కే
ల్వెట్టి దినేంద్రరత్న మవలీల గ్రహించి ముదంబుతోడ దా
కట్టుగ జూపినట్టులరె గాములతే డల పూర్వదిక్కునన్.

వ॥ అంత సూర్యోదయంబయిన సూరదాసుండు.

తో॥ విరక్తిచే దనకనులు బొడుచుకొని వీథిలోన విడుమనియెన్ ।
ద్విరదగమన కడుచింత నొంది యాద్విజు నటు విడువగజనియెన్.

వ॥ ఇట్లు తానొనర్చిన దుశ్చరిత్రకు చింతింపుచు మనంబున.

కాఫి — చతురశ్రగతి.

సామజపాలన సరగున రా । వేరా రణశూర సుకుమార జితమురాసుర॥
శ్యామలరూపా! జితకామారిచాపా।వరద్యుమణిక్షపాకరనేత్ర ధృతిగోత్ర
రాకేందునిభవదన రాజితరిపుమదన బాలాజీహృత్సదన
నీకిటు పరాకేల పాతకహార బ్రోవకయున్న కీర్తి సున్న
వెన్నదొంగ! రంగా! నంగ భంగనుతచరిత హతదురిత, కృతినిరత ॥సా॥

వ॥ ఇట్లీశ్వరధ్యానం బొనర్చుచు సూరదాసుం డరుగ నాసత్యవతి రంగనాథుం గని.

సురట — చతురశ్రగతి.

స్వామి! జితకామి! యేమని జెప్పుదు భూమీసురుని తెగువ ॥సా॥
శ్రీమహిళాధిపభక్తా! విరక్తా! యా
సూరదాసు రెండుసూదుల నిమ్మని గోరిన వానికి నేరుగ నొసగితి
పారుడుచింతనొంది ధీరతతో జలపూరితాక్షులను బొడుచుకొనియె ॥సా॥
సమ్మతిబాలాజీని చక్కగనేలెడు కమ్మవిల్తుజనకుని నెమ్మది దలచుచు
నమ్మారాజవీథియందున విడువుమన నమ్మకీడిదివిజునినట్లనెవిడిచితి ॥సా॥

వ॥ ఇట్లన రంగనాథుం డాశ్చర్యంబున.

కాఫి — త్రిశ్రిగతి.

ఎంతో వింత, కాంత ! శాంతస్వాంత ॥యెం॥
ఇంతపనిజేసెనా, యనంతాసుపర్వాణుడహా ॥యెం॥
పాపవినాశనుడ । పారుడై వచ్చి నీదు । లోపమేమోగని ।
కోపమునుబూని యీపగిదినిజేసె నిందుముఖి శాబాసు ॥యెం॥
సన్నుతాంగి బాలాజిని । మన్ననతోడగాచె । వెన్నునిపాదధూళి
చెన్నుగబడబాళి । క్రిన్ననబోవునని । కాంతనమ్మితినహా ॥యెం॥

క॥ ఈరీతిని సతిపతు లిల । సూరాఖ్యుడు జేసినట్టి సుద్ది దలచుచున్
భూరి విచారమునొందిరి । పారుడు తనుజేసినట్టి పనికి వగచుచున్.

సీ॥ నవ్వులాటకునైన నరహరినామంబు, చింతసేయని శుద్ధచెనటిననుచు
యాత్రార్థమైనను ధాత్రీసుతాధిప, మందిరం బేగని పందననుచు
స్వప్నమందైనను సారసాక్షుని పాద, పద్మముల్ జూడని పాపిననుచు
పాత్రాపాత్రతపరగ నెఱుంగక, ధనముబోగొట్టు దుర్జనుడననుచు

గీ॥ పుడమిలో నిట్టి పుట్టువు పుట్టనేల
నూతబడి చావునొందుట ఖ్యాతియనుచు
పరుగులెత్తంగ శ్రీహరి కరుణబూని
పారుడై వచ్చి హస్తంబు పట్టుకొనియె.

వ॥ అంత సూరదాసుండు వానితో.

కమాచి — చతుశ్రిగతి.

ఎవరయ్యమీఱు త్వరగ చెల్పుడు నే ॥డెవ్వ॥
చివ్వున నిటకునచ్చి । చేతిని బట్టుకొన్న వా ॥రెవ్వ॥
కామాంధమునను వణి । గ్భామామణిని మోహించి ।
భూమిలోపల పాప । స్తోమమునకు లోనైతి ॥నెవ్వ॥

యిట్టిజన్మమేలనని । దిట్టమగు నీకూపమున ।
గిట్టుశే యుత్తమమని । యిందుబడుటకు వచ్చితి ॥నెవ్వ॥

నెట్టన బాలాజినిచే । పట్టిబ్రోచిన పసిడి ।
పుట్టమువాడు బ్రోచు కే । ల్పట్టువిడువుము నే ॥దెవ్వ॥

వ॥ ఇట్లా బ్రాహ్మణ వేషధారి యగు దేవుండు.

క॥ ఓపారుడ గుణవంతా । నాపేరువచింతు సత్యనారాయణుడన్
కూపలో దిగనెంచితి । నీపాపవృత్తిసలుప నేలా ? మేలా ?

వ॥ అని యిట్లని సెప్పి సూరదాసుని దేవుండు గాంచి.

కాంభోజి — మిశ్రగతి.

స — పరోపకారార్థ మిదం శరీర మను పద్ధతిని నీకర
సరోజములు వట్టితినిగాన నీవని సలుపకు గుణనికర ॥పర॥

సూ — జాతస్యమరణంధృవం బను వచన విఖ్యాతిని వినలేదా? యెప్పు
డైతేనేమి యింక జీవించియుండిన పాతకము వృద్ధిగాద॥

స — నరహరి జీవకోటిలో నుత్తమంబగు నరజన్మమిచ్చె కారణం ।
బరయగ హరినెదస్మరియించి స్థిరమగు పదముగొనుటకు ధీరా !

సూ — అంధుడనౌట మీయందముజూచి యానందించుటలేదయ్యెనన ।
సింధుజావల్లభు డందున కరారవింద ముంచగ బాగయ్యె॥

వ॥ అంత దాసుండు పామరుని కరము వట్టి.

సూ — బాలాజీనేలు గోపాలుడవుగాని పారుడవుకావయ్య గుణ
జాలా । ననుబ్రోవు మీలీల జేసి నట్టి శీలుల గాననయ్య॥
వ॥ ఇట్లు వచించి హరికరము దాసుడువట్టి విడువకున్న.

గీ॥ విప్రవర్యుడ నన్ను శ్రీవిభునిరీతి
మదిని భావించు టది నీకు విదితమగునె
భూరి పామరయుతుడనై భూమిలోన
రమణ కెక్కిన సత్యనారాయణుండ॥

వ॥ ఇట్లు పలికి యిచ్చటనున్న దాసుండు తొందర కలుగజేయునని బాపనిరూపమూనిన శ్రీహరి సూరదాసుచేతిని చిక్కియున్న తన హస్తమును దప్పించుకొని యంతర్ధానుండయిన దాసోత్తముండు హరిని భావించి.

కళ్యాణి — చతురశ్రగతి.

ఎందుకు నిర్దయ నీ ॥కెందు॥
ఇందిరాధిప । మందుడనుగద ॥యెం॥
కందనిభాంగా! కలుషవిభాంగా! సుందరరంగ! సువర్ణతురంగ! నీ ॥కెందు॥
కమలాక్ష! సకలజీవులందు । సమబుద్ధినుంట సర్వేశ్వరునకు ।
క్రమనుగాని భేదమునెంచుట న్యాయముగా దీ యనాథపై ॥నెం॥
ధరణిలోన బుణ్యాత్ములఁ బ్రోచుటగొప్ప । గాదప్ప ।
పరగ పామరులబాలించుటయే గొప్ప । యగుచెప్ప ।
సిరికోమరు నెవ్వరు తరచుగ గారవింతురుగాని రిక్తుని ।
నిరసింతురు వానిభక్తిని జేరదీయరు వానిడాయరు ।
నరులపగిది నడుచుట నీ కిది ఘనత యోచినతా ।
తనయుగమన! బాలాజీసుమన । సాబ్జతపన! ॥యెం॥

వ॥ నిష్ఠురోక్తిని.

కాఫి — త్రిశ్రగతి.

చిన్నకృష్ణా నీనంశోపుచిన్నె తెలసెరా దాని నెన్నెద వినరా! యో
పన్నగారి వాహన యాపన్నివారణ! యిటుగనర మాటవినరసిగ్గైతే చనర॥

అన్న హలధారి నీయక్క యుమారి । యాలిసకలజనాధారి
అత్తపరాధారి । సుతుడుజారి । హామత్తారి మురారి । ॥చిన్ని॥
మరదిగురుద్రోహి । మనుమడు జడదారి । నరహరి నీవదినె ధనహీ
నముగలనాతి, బంటుకోతి, దనుజారాతి, యిదే నా నీఖ్యాతి ॥చిన్ని॥
తండ్రినిర్దయుడు సీతనయవ్యభిచారి తల్లిసంకెలలోన జిక్కె
తరణీకులేంద్రా! ధృతిచంద్రనతోపేంద్ర! గుణసాంద్ర! రామచంద్ర॥చిన్ని॥
బాలాజీదాస హృదయవారిజమిత్ర । నీలోపము నీ వెరుగక
నాలోప మెన్న న్యాయమన్న బ్రోవకున్న । మును నీకున్న ।
కీర్తిఁ సున్న । యోవెన్నదిన్న ॥చిన్ని॥

తోడి — చతురశ్రగతి.

ఓదయానిధే నీదయ నామీద నేలరాదయ ॥యో॥

పాదుగనీపాదమెగతి రూపవిజితమీనాంక చక్రాంక ॥యో॥

నీలమేఘవర్ణ నాదు కిల్బిషజాలములఁ బారదోలి నీదగు
శీలమైన ముక్తినిత్తువని వనమాలి నమ్మియుంటి సాధుజన
పాల తమ్మికంటిమదరిపువిశాలశూలి వింటిని విఱచిన
పాలకడలిశయన నీవు కడుబలశాలివగుట నాచేతనున్న నీ ।
కేలునుదప్పించుకొని యెటో నవలీల బోతివయ్యా యల
పూలవిల్తునయ్యా । యిది నీకు వీలటయ్యా । అయితే ।
మేలగు నాహృదయమునునుండి । యేలాగున బోదువో హమ్మా
మగవాడైతే జమ్మా । యిక నెన్నటికి నిను నమ్మ ।
జాల । యోబాలాజీపాల ॥యో॥

వ॥ ఇట్లు ప్రార్థింప సూరదాసునియుక్తికి సంతసించి ప్రసన్నుం బై
వరంబువేడుమన దాసుండు.

ఉ॥ పల్లవరాణిహృత్కుముదవారిజవైరి త్వదీయరూపమున్
జల్లగ నేడుచూడ కడుసంతసమాయె మదీయపాపముల్
దెగ్లెను రంగనాథునకు దేవికి నారదగానలోలసం
ఫుల్లసరోజనేత్రి సురపూజిత ముక్తినొసంగుమీ ధరన్.

వ॥ ఇట్లు గోరిన శ్రీహరి సూరదాసుం గాంచి.

క॥ వారిజభవవంశాగ్రిణి । సారంబగు మాటవినగ సంతసమయ్యెన్
గోరినరీతిని చేరికి । నారికి నపవర్గమిత్తు నయగుణచరితా !

వ॥ ఇట్లానతిచ్చి సూరదాసా, నీకుమాత్ర మింకొకజన్మంబునగాని మోక్షంబుదొరకదనిన దాసుండు విని దేవా, నీదివ్యమంగళవిగ్రహంబును జూచిన నేత్రంబులచే నితరవస్తువులంజూడగాన నిష్టమైన నింకొకజన్మంబునగాని మాంసచక్షువులనియ్యక మిముంజూడ జ్ఞాననేత్రంబొసంగుమనివేడ వల్లెయని హరి చనియె నంత సూరదాసుండా దేహము విడిచి మధురాపురంబున నొకపారునింట జాత్యంధుడై గంధర్వాంశచే జనించి గాననిరసితనారదుండై హరినామసంకీర్తనజేయుచు జ్ఞాననేత్రముచే శ్రీహరిని వీక్షింపుచు హిందూస్తానీభాషలో ననేక కీర్తనలంజేయుచు కాలంబు గడుపుచుండె నంత నంతికాపురాధిపతి యోలగంబున తోడి బ్రహ్మయ్యశాస్త్రి యను గాయకుండు.

తోడి — చతురశ్రగతి.

ఎందు దాగియున్నావో యిందిరాధిప నీ ॥ యెం॥

అందగాడ నీజాడ నేవాడ నరసిజూడ తెలియదుగద సిరిజేడ ॥యెం॥

భక్తవరులుబ్రోవుమని బాధింతు రను భయముననో పద్మాహృ
త్కుశేశయముననో మానీంద్రుల సద్ హృదయముననో ॥యెం॥

నీ, రజదళనయన నీలనీరదగాత్రి బాలాజీని, బ్రోచితివని ఖ్యాతి వి
ని, రయమున నిను, వెదకితిని రాదా కృప నాపై

ని, కలుషతిమిర సీ, రజహీన రజనీ, చర పవనసఫణి, రవికుల
సీ, రథి, రజనీ, కర ధరణీ, ధర ధర, మురహార, కరివర,
దా మునిపోషణ, మృదుతరభాషణ, కదనవిభీషణ,
కౌస్తుభభూషణ రిపుశోషణ ॥యెం॥

వ॥ ఆశాస్త్రిగా రిట్లు గానంబుసేయ సభ్యులందరు మిగులగొనియా
డ నతం డాభూపతినిగాంచి దేవా! నాపాటయనగానెంత మధురాపురంబు
న సూర్యప్రసా దను జాత్యంధుడుసేయు గానము మిగుల యద్భుతము.

శంకరాభరణము — త్రిశ్రగతి.

అతని సద్గాన మద్భుతము దలంప ॥నాత॥
వాతాశపరిభుక్తైన । వశమగునా వర్ణింప ॥నాత॥
వనజజుడు తాళంబు । వాణీవీణాగానంబు
గణపతిమృదంగంబు । కంజధరుడు నాట్యంబు
ఘనతరముగజేయు । స్థలగాత్ర్యాయని డాయున్ ।
దనరగ బీ. బాలాజీ । దాసుని సంరక్షించిన ।
పనజాక్షుడు బలే శ । బాసని లేచుఞ । పద్మా తలయూచున్ ।
మోళ్ళకు చిగురులు మొలచున్ ॥నాత॥

వ॥ ఇట్లు బలుక విస్మయమంది సూర్యప్రసాదుని రావించి గౌర
వించి గానంబుసేయు మని ప్రార్థింప నాదాసుం డద్భుతగానంబొనర్ప
సభ్యులందరు శరీరంబులు మఱచిరి. ఈసంగతి రాణి యెరింగి దాసుని
రావించి జాత్యంధుడుగాన తెర యవసరంబులేదని వెల్లడిగా గూర్చుండి
యుండి గానంబొనర్చుమని నియోగింప నాతండు శ్రీహరిని భావించి.

శంకరాభరణము — చతురశ్రగతి.

ఏమంటిరా? యేణాంకవదన! ని ॥న్నే॥

కోమలదేహా ! నాపై ! కోపమేల ? గోపబాల ! తాపసలోల ! ॥యే॥

మంగళాంగ ! నీపదతిని రక్షన । దొంగపాలు సేసితివంటినా ? య
నుంగుసోదరుడు మూర్ఛిల్లిన బహుభంగుల విలపించితి నంటినా ?
యెంగిలిపండ్లని యెగ్గెన్నక భుజియించి తనివినొందితి నంటినా ? య
నంగజనక ! పాదముచే రాతిని నాతిని జేసితివంటినిగాని
రంగుమీఱ నన్నుబ్రోవుము కినుకమాని కృపబూని భూజాని ॥యే॥

చిత్రజారిపూజితపాద ! మేసత్త పొత్తుసల్పితివంటినా ? గొల్ల
బిత్తరులిండ్లనుజేరి వెన్న పాలెత్తుక వచ్చితివంటినా ? యాదవ
సత్తమ మృత్తు భుజించి యశోదాసఖియ త్రాట జిక్కితివంటినా ?
యుత్తర గర్భస్థుం డగు పరీక్షిత్తును బ్రోచితివంటి గాని
యుత్తనేరమెంచుటన్యాయముగాదురసామి ఖగగామి భృతభూమి ॥యే॥

కపటవేష కౌరవపాండవు లనికి కారణుడవంటినా ? కౌర
వపతి దిగంబరుడై చనవద్దని వచియించితివంటినా ?
తపనతనయునకు శాపమిడినట్టి కుపితుడవంటినా ? పాండవ
శపథము లీడేర్చి పాలించిన శత్రువిదారివంటినిగాని । నా
యపరాధంబేమో దెల్పుము శ్రీహరిబాలా, జీపాల, గుణశీల ॥యే॥

వ॥ ఇట్లు దాసుం డవంతికాపురాధీశునిభార్యచెంత గానంబుచేయ నచ్చటి స్త్రీలందరు సంతోషాన్వితలై వినుచుండుతఱి సత్యభామ వాని యెదుట నిలిచియున్న దాసుండు జ్ఞాననేత్రంబున నామె నాలోకించి 'యమ్మా యిచ్చటి కేల వచ్చితి' వన రాజభార్య నేత్రము లీ దాసునను లేవందురుగదా చూచినట్లు మాఁగ్లాడుచున్నా డని సిగ్గునొంది లోపలికి నింతలో దేవుం డరుదెంచి గానముసేయు దాసుని తనలో నైక్యము జేసికొనియె.

సురట — చతురశ్రగతి.

దేవకీనందన । దివిజారిబంధన మంగళం జయమంగళం ॥మంగ॥

పావనినుతపాద । భక్తజనామోద ॥మంగ॥

పద్మపత్రనేత్ర । పద్మారిధరమిత్ర ॥మంగ॥

పద్మాలయాకళత్ర । పద్మాసనస్తోత్ర ॥మంగ॥

గాంగేయమృగహర । గాంగేయనగధీర ॥మంగ॥

గాంగేయాక్షవిదార । గాంగేయపటధర ॥మంగ॥

స్థిరయనాకపలివాస । తిలపుష్పసమనాస ॥మంగ॥

నరబాలాజీదాసావన యదుకులభాస ॥మంగ॥

స ం పూ ర్ణ ము .